శ్రీరస్తు.

# శ్రీభగవద్గీతామంజరి

మంజరి.

ఇది

రాజా పానగంటి పార్థసారథి రాయనింగారు, బి. ఏ.,

రాజా ఆఫ్ పానగల్ చే

విరచితము.



చెన్నపురి:

శ్రీ 'రామ' ప్రెస్సున

ముద్రితము.

౧౯౩౧.



వేంకటరంగనృపతి.

క. అన్నియుఁ దానై తానై
యన్నిట నన్నిటికిఁ దానె యాదరు వై తా
నన్నిట రేఁడై యున్నఁడు
నున్నట్టి మఱొండు లేని యొక్కనిదలఁతున్.

క. తలిదండ్రు లచ్చమాంబకు
నలవేంకటరంగ నృపతి కౌదలనతులన్
జెలుపుచు భగవద్గీతల్
దెలుఁగున రచియింపఁ బూనితిని పితృసేవన్.

శ్రీ ర స్తు

# శ్రీ భగవద్గీతా మంజరి

## మొదటి అధ్యాయము.

### అర్జునవిషాదయోగము.

ధృతరాష్ట్రుఁడు పల్కె.

ధర్మభూమిని గురుస్థానంబునందు
డీకొనఁ గోరి కూడిన పాండవులును
నావారు నేమి సంజయ, సల్పినారు

సంజయుఁడు పల్కె.

వ్యూహంబు గాఁగను బొనరింపఁగఁబడి
నిల్చిన పాండవానీకముం గాంచి
యనె సుయోధనుఁడు రాజపుడు డాసి గురు

దుర్యోధనుండు పల్కె.

బుద్ధిశాలి ద్రుపదపుత్త్రుండు నీదు
శిష్యుండు తీర్పఁగాఁ జేరిన దీనిఁ
బాండుపుత్త్రుల పెనుబౌజుఁ గన్గొజ్జ

ఆలంబునందు భీమార్జునులకును
సములు బల్ విలుకాం డ్రిచటిమేటిమగలు,
పురజిత్తు మఱి కుంతిభోజుండు, మగల
తలకట్టు శైబ్యుండు, ద్రౌపదేయులును,
వీర్యవంతుఁడు కాశివిభుఁడు, సుభద్ర
తనయుండు, మఱి చేకితానుండు, మఱియు
యుయుధానుఁడును, వీరుఁ డుత్తమౌజుండు,
బలి యుధామన్యుండు, బల్ తేరువాఁడు
ద్రుపదుండు, ధృష్టకేతుఁడు, విరాటుండు,
అందఱుగూడ మహారథుల్ వారు ౪, ౫, ౬

మఱి ద్విజోత్తమ, నాదు మందులయొక్క
గమికాండ్రు మనవారు ఘనులు నెవరో
వారి నెఱుఁగు, నీకుఁ బలికెదఁ దెలియ ౭
కర్ణుండు నీవు వికర్ణుండు, కృపుఁడు
సమితింజయుండును సౌమదత్తియును
ద్రౌణియు, మఱి జయద్రథుఁడు భీష్ముండు ౮
పెక్కండ్రు పెరవారు బీరంపుమగలు,
జీవముల్ నాకై త్యజించినవారు,
బహువిధంబుల శస్త్రపరికరంబులను
గొన్నవార్ భండన కోవిదు లెల్ల ౯
అల్లదె మనది, భీష్మాభిరక్షితము,
బల, మపర్యాప్తంబు, వారల బలము

పర్యాప్త మిదె భీమపరిరక్షితంబు ౧౦
మొనలనెల్లఁ దమతావులను మీ రెల్ల
నిలుచుండి కావఁగా న్భీష్మ సేవలయు ౧౧
వానికి హర్షంబు ప్రభవింపఁగాను
సింహనాదము పెల్లు చేసి వీరుండు
కురువృద్ధుఁ డొత్తె సంకును బితామహుఁడు ౧౨
వెసనె గోముఖశంఖభేరులు మఱియు
నానకపణవంబు * లలికిడిసేయ
నయ్యెను దుములంబు నాశబ్దమంత ౧౩
తెల్లగుఱ్ఱాల పెన్తేరునందున్న
పాండవుండును నంత వాసుదేవుండు
దివ్యశంఖముల నొత్తిరి, హరి యొత్తెఁ
బాంచజన్యంబును, బౌండ్రంబు నొత్తెఁ
బెనుసంకు భీముండు భీమకర్ముండు,
దేవదత్తంబు నొత్తె ధనంజయుండు,
సహదేవుఁడు మణిపుష్పకము శబ్దించెఁ,
బూరించెను సుఘోషమును నకులుండు,
నృపతి కుంతీజుఁడయిన యుధిష్ఠిరుఁడు,
నలికిడిసేసె ననంతవిజయము,
ఘనకార్ముకుండైన కాశ్యుండు మఱియు
నపరాజితుండు సాత్యకి మహారథుఁడు
నైన శిఖండి మహాబాహుఁడైన

* అలికిడి=శబ్దము.

సౌభద్రుఁడు మఱి ధృష్టద్యుమ్నుఁడు మఱి
ద్రోవది తనయులు ద్రుపదుండు మఱియు
నృపతి! విరాటుండు నెల్ల ప్రక్కలను
నొత్తిరి శంఖంబు లొక్కొక్కఁడుగను ౧౮
భూనభంబులు నిండ మ్రోఁగి యాఘోష
సురిగించె ధార్తరాష్ట్రుల డెందములను ౧౯
కుతలేశ శస్త్రముల్ కురియ నుండంగఁ
గపికేతనుం డైన కౌంతేయుఁ డంతఁ
దీరి నిల్చిన యట్టి ధృతరాష్ట్ర సేన
నీక్షించి ధను వెత్తి యీపల్కు లనియెఁ
గృష్ణునితోడ, "నో కృష్ణ నా తేరు
నుభయ సేనల మధ్య నుండఁగా నిల్పు ౨౦, ౨౧
ఈ యుద్ధయత్నమం దెవరితో నేను
బోరంగ నౌనట్టి, పోరంగఁ గోరి,
నిలిచియుండెడి వీరి నేఁజూచు తఱిని ౨౨
దురమున దుర్మతి దుర్యోధనునకు
హర్షంబు గల్పింప నాలంబునల్ప
నిటకు వచ్చిన వీరి నేను జూచెదను." ౨౩
విజయుండు నిట్టుల వేఁడఁ గృష్ణుండు,
ద్రోణభీష్ములు నెల్ల దొరలకు నెదుట
నుభయ సేనల మధ్య నుంచి బల్తేరు
వచియించె ధాత్రీశ, "పార్థ! కన్గొనుము

గమికొని యున్న యీకౌరవుల" నని ౨౮, ౨౯
అంతఁ బార్థుఁడు గాంచె నట నిల్చియున్న
తాతలన్ సుతుల భ్రాతల మాతులులను
మామలన్ చంద్రులన్ మనుమలన్ సఖుల
నిరుదళంబులను సుహృదులను గురుల
శ్వశురులన్ నిల్చిన బంధులనెల్ల,
సవ్యారి వీక్షించి యాకుంతికొడుకు,
పరమమౌ కృపఁజెంది వగ నిట్లు పల్కె,

అర్జునుఁడు పల్కె.

"చివ్వ సల్పఁగఁ గోరి చేరి యున్నట్టి
వీరిని మావారి వీక్షించి నాదు
గాత్రముల్ శిథిలమౌఁ గంపించు నొడలు
ముఖమెండు రోమముల్ మొనలపై నిక్కె
గాండీవ మురియాడుఁ గరముండి కృష్ణ,
చర్మంబు మండు నశక్యమౌ నిలువ
మనసును భ్రమచెందు మాడ్కిఁ దోఁచెడిని
విపరీత సూచనల్ వీక్షింతుఁ గృష్ణ! ౨౯,౩౦
స్వజనంబు ననిలోనఁ జంపి మేల్ గాంచె
కోరను విజయంబుఁ గోర రాజ్యంబుఁ
గోర సుఖముఁ గృష్ణ! గోవింద! మనకు
రాజ్యంబు భోగముల్ ప్రాణమేనేల ౩౨
భూమియు సౌఖ్యముల్ భోగముల్ మనము

వలతు మెవ్వారికై వారలే యనిని
జేరిరి విత్తముల్ జీవముల్ విడిచి ౩౩
తండ్రులు బిడ్డలు తాతలు గురులు
నల్లి మాతులులు వియ్యంకులు మఱియు
మామలు బావలు మనుమలు గూడ ౩౪

త్రైలోక్యరాజ్యంబు దార్చునప్పటికిఁ
జంప నొల్లను వీరిఁ జంపఁ బడినను,
నిలకు మాత్రంబేని యేమి యాఁ గృష్ణః ౩౫
ధార్తరాష్ట్రులఁగూల్చి దైత్యారిమనకు
నేమి ప్రీతి లభించు నీపాతకులను
వధియింపఁ బాపంబె ప్రాపించు మనల ౩౬

గాదిలి వారితోఁ, గాఁబట్టి, మనకు
ధార్తరాష్ట్రులఁ జంపఁ దగదు శ్రీకృష్ణ,
సుఖులమె ట్లగుదుము చుట్టాలఁ గెడపి ౩౭
కులమునాశము చేయఁ గూడు దోషంబు

మిత్రుల వంచింప మిగులు పాపంబు
పేరాస మదిచెడ్డ వీర్ గనరేని ౩౮

కులమునాశముచేయఁ గూడు దోషంబు
నీక్షించు మనకేల యీ పాతకంబు
నుండి తొలఁగ నేరనోపని దగును ౩౯
కులము పోవ ననాది కులధర్మములును
నడఁగును, ధర్మంబు నడఁగుట మఱియు

కులమంతట నలముకొను నధర్మంబు ౪౦
దూష్యలు స్త్రీలవుదు రధర్మమెచ్చు
నచ్యుతా, దుర్మార్గలైనచో స్త్రీలు
వార్ష్ణేయ, పాటిల్లు వర్ణసంకరము ౪౧
నరకంబె కలుగు సంకరమునఁ జేసి
కులమునకును మఱి కులఘాతకులకుఁ;
బిండోదకక్రియ ల్వీడుటయును
వారల పితరులు పడుదురు కాదె ౪౨
వర్ణసంకరమును బడయించునట్టి
కులఘాతకు లవి యీ *కొడిమెలవలన
శాశ్వతంబుగ నుండు జాతిధర్మములుఁ
గులధర్మములుఁ గూడఁ గూలిపోయెడిని ౪౩
అపగతకులధర్ము లౌ వారికెపుడు
నరకవాసము గల్గు నా వింటిమి హరి ౪౪
రాజ్యంబు సుఖమును గ్రహియించునాస
స్వజనంబు వధియింపఁ బనిఁ బూన నెంతొ
పాపంబు సేయఁ బాల్పడినార మకట. ౪౫
బాణముల్ విడనాడి బదు లేయని నను
ధార్తరాష్ట్రు లని శస్త్రకరులౌ వారు
నైనఁ ద్రుంతురే న్నాకదౌ మేల్ మఱంత ౪౬
అర్జునుం డి ట్లని యాడి యుద్ధమున

* కొడిమెలు = దోషములు.

వింటిని గోలతో విడనాడి రథము
నందు శోకాకులుఁడై కూరుచుండె. ౪౭

---

# రెండవ అధ్యాయము.

## సాంఖ్య యోగము.

సంజయుఁడు పలికె.

కడుజాలి మునిఁగి దుఃఖంబును బొంది
కొలుకులఁ గన్నీరు గుప్పు నవ్వానిఁ
గూర్చి యిట్లని పలికె గోవిందుఁ డంత ౧

శ్రీ భగవంతుఁడు పలికె.

"నర! విషమమునందున నకీర్తికరము
నస్వర్గ్య మైనద నార్యజుష్టంబు
నైన యీ కశ్మలం బయ్యె నీ కేల ? ౨
వలదు క్లైబ్యంబొందఁ, బార్థ నీయందుఁ
దగదది; శూర! క్షుద్రం బైన గుండె
దౌర్బల్యమును బోవఁ దట్టిలే లెమ్ము" ౩

అర్జునుఁడు పలికె.

"పూజ్యులౌ ద్రోణభీష్ముల నని దేవ,
కోలలన్ నేను మార్కొను టెట్లు కృష్ణ ౪

పెద్దలౌ గురువుల విదళింపకుండ
భక్షింప శ్రేయంబు భైక్షమే నిటఁగ,
నడఁతునేఁ గురువుల నర్థాతురతను
భుజియింతు నెత్తుటి భోగములె యిట. ౫
ఎయ్యది మనలకు నెక్కుడైనదియొ,
గెలుతుమో యెఱుఁగము గెలుతురో మనల
నెవ్వారి జంపి జీవింప వలవమొ
యాంధార్తరాష్ట్రులే యని నిల్చినారు ౬
*కోటికతనము సోఁకుఁ గోనస్వభావమునఁ
†గఱితఁ గన్గానలేని ‡కఱదనే నిన్ను
నడిగెద శ్రేయ మెయ్యది నిశ్చితమది
చెప్పు, నీమఱుఁగుఁ జొచ్చిన వాఁడ నేను
నీకు శిష్యుండ నన్నిపు శాసింపు ౭
భూమి నడ్డము లేని పూర్ణరాజ్యంబు
త్రిదశాధిపత్యమొందియుఁ గూడ నాదు
నింద్రియంబుల నుడికించు శోకంబు
శమియించు నది చూడఁ జాలను గాదె” ౮

సంజయుఁడు పల్కె.

కృష్ణుతో నరిభీముఁ డిట్లని నరుఁడు
ఆగెఁగ నని సల్పనని హరితోడ ౯

* కోటిక=లోభి. † కఱితఁ=పని. ‡ కఱద=బుద్ధి.

దుగదళంబుల మధ్యదురపిల్లు నతని
నిట్లనె హరి హసియించున ట్లీశ ౧౦

శ్రీ భగవంతుఁడు పల్కె.

వగచి తీవు వగసల్పఁ దగనివారి,
జ్ఞానంబు పల్కెదు, జ్ఞాను లేడువరు
జీవులకేన్ గత జీవులకేని ౧౧
ఏఁగాని నీవేని యీరాజో లేని
లేని దెన్నఁడు లేదు లేదు లేకుంట
యిందఱమును గూడ నిటు తరువాత ౧౨
దేహికేరీతి నీ దేహంబునందు
బాల్య యౌవనములున్ వార్ధకత్వమును
బ్రాప్తించు దేహాంతరంబును నట్లె
పొందఁడు ధీరుండు మోహంబు నందు ౧౩
పొడము మాత్రాస్పర్శముల నర, సుఖము
శీతోష్ణదుఃఖముల్, స్థిరములుగావు,
వచ్చుచుఁ జెనుచుండు, వాని నోర్వునర, ౧౪
సుఖదుఃఖము లొకంట జూచు ధీరుండు
నగు నే పురుషు నివ్వి వ్యథఁ గొల్పలేవొ
యతఁడె గా తగుఁ బార్థ యమృతత్వమునకు ౧౫
లే దసత్తునకున్కి లేదు సత్తునకు
నుండమి, యీ రెంటియొక్క నిక్కవము
కనఁబడు తత్త్వంబుఁ గనువారిచేత ౧౬

ఇది యంత దేన నావృతమయియుండు
దాని నాశము లేని దానిఁగ నెఱుఁగు,
అవ్యయం బగుదీని నడఁగింపఁగాను
వలను గానేర దెవ్వానికి నైన ౧౭
అవినాశి యప్రమేయంబు నిత్యంబు
నౌ దేహి దేహంబు లౌ నివ్వి పార్థ,
యంతవంతములందు, రొటఁ జేల్పు మని ౧౮
కూలుప దియ్యది కూల్పఁగాఁ బడదు;
ఎవఁడు హంతగ దీని నెంచు నాతండు
నెవ్వండు హత మని యెంచునో దీని
నా యిద్దఱునుగూడ నజ్ఞులౌ వారు ౧౯
పుట్టదు గిట్ట దెప్పుడయేని యిద్ది
ఉండియవ్వలమఱీ, యుండమి లేదు
అజము శాశ్వతము నిత్యము పురాణంబు
చావ కుండెడు నిది చావఁగా నొడలు ౨౦
అవ్యయం బవినాశియజము నిత్యంబు
నని దీని నెఱిఁగిన యాతండు పార్థ!
యెతని నె ట్లడిపించు నెవనిని నడచు ౨౧
పురుషుఁ డెట్టులు ప్రాఁత పుట్టముల్ వాసి
క్రొంబుట్టముల్ దాల్చు కొనునట్లు దేహి

'ఆత్మ' కుమహద్వివక్షచేయ కుండుటే యాంధ్రసంప్రదాయమున కనుగుణము.

ప్రామేసులం బాసి పడయుఁ గ్రొత్తలను ౨౨
దీని శస్త్రములు ఛేదింప, వేర్పడును
ననలంబు, నెండింప దనిలంబు దీనిఁ,
దేమగఁజేయదు దీనిని జలము
అచ్ఛేద్య మిది యశోష్యమె యచలంబు
నక్లేద్య మిది యదాహ్యము సర్వగతము
స్థాణువు నిది సనాతనము నిత్యంబు ౨౪
కాదు వ్యక్తం బిది కాదు చింత్య మిది
యవికార్య మియ్యది యందురు, గాన
నిటు దీని నెఱిఁగి శోకింపఁగాఁ దగవు ౨౫
నిత్యంబుఁ బుట్టుచు నిత్యంబుఁ జెనుచు
నుండు నంచును దీని నూహింతువేని,
ఏడ్వారా దట్లయ్యు నీ విట్లు వీర ౨౬
పుట్టిన వానికి బ్రుంగుట విడదు
బ్రుంగిన వానికిఁ బుట్టు వీడదుగ,
అవుటచేఁ దప్పింప నలవిగానట్టి
దానికిఁ గా నీవు తగవు శోకింప ౨౭
భూతముల్ గనరాని మొదలు గల్గినవి
కనరాని తుదవియె గనవచ్చు నడుమ,
భారత,యం దేమి పరిదేవనంబు ౨౮
కాంచు దీనిని వింతఁగా నొక్కరుండు,
నట్లె వింతఁగ దీని నన్యుఁడు పల్కు

వింతఁగా నే దీని విను మఱి యొకఁడున్
ఎఱుఁగఁడు విన్నను నెవఁడును దీని ౨౯
అన్నింటి దేహంబు లందుండు దేహి
యిది యవధ్యము పార్థ యెప్పుడు, గానఁ
దగవు నీ కఖిలభూతంబులు వగవ ౩౦
తగవు స్వధర్మంబుఁ దలపోసి యైనఁ
గంపింప, ధర్మ్య మౌ కలనకన్నఁగద
శ్రేయ మొం డొకటి క్షత్త్రియునకు లేదు ౩౧
తనయంతఁ దాన ప్రాప్తం బైన యిట్టి
బవరంబు, తెఱచిన వాకిలి గలుగు
స్వర్గ మౌ! నది సుఖవంతు లౌ నట్టి,
క్షత్త్రియులకుఁ బార్థ సంప్రాప్త మౌను ౩౨
సల్పవే నీ ధర్మ్యసంగ్రామ మీవు,
నీదు ధర్మంబును నీ దగుకీర్తిఁ
బోనాడి పాపంబుఁ బొరయఁగాఁ గలవు;
అందఱు నీదగు నవ్యయం బైన
యపకీర్తి వాక్రుత్తు, రపకీర్తి యగును
జావు కన్నను మింపు సంభావితునకు ౩౪
భయముచే రణమును వదలితి వంచుఁ
దలఁచెదరు మహారథముల వారు నిన్;
బహుమతుండవు ము, న్నెవరిలోన వారి
యందున లాఘవం బలవడు నీకు ౩౫.

నీదు సామర్థ్యంబు నిందించు నీదు
పగవార లనరాని పల్కులం ద్రెన్నా:
యంతకన్నను దుఃఖ మధికమే యుండు.
హతుఁడ వైనను స్వర్గ మలవడు నొండె,
నవని నేలెదవు గెల్పయినచోఁ, గానఁ
గదనంబునకుఁ బూని కౌంతేయ లెమ్ము
సౌఖ్యంబు దుఃఖంబు జయము నజయము
లాభనష్టములఁ దుల్యంబులఁ జేసి
పోరఁ బూను మఘంబురఁ బొందవల్లైన
సాంఖ్యంబులోని యీజ్ఞానంబు నీకు
బోధితం బయ్యె, నేబుద్ధితోఁ గూడఁ
గర్మబంధంబులఁ గడవంగఁ గలవో,
యట్టి యీయోగంబు నాలింపు; పార్థ.
*దొరకోలు చెడదిందు దోసంబు లేదు,
ఈధర్మలేశంబు †నేర్చుఁ బెఱ భీతు
అచల మౌ నొక్కటి యగుబుద్ధియందు
నర్జునా, యయ్యెడు నస్థిరాత్మునకుఁ
గొనలేని పలుతెఱంగుల బుద్ధులు గద
ఐశ్వర్యభోగంబు లందఁగాఁ దఱచు
నానాక్రియల్ గల్గిన యడియు నైన
పుట్టు కర్మమున కవును ఫలం బనె

* దొరకోలు=యత్నించుట. † ఏర్చుఁ=చక్కఁబఱుచు.

వేదవాదరతులు, వేరు లే దనుచు
స్వాదుగాఁ బల్కెడు పండితుల్ దాన
నపహృతచేతస్కు లౌ నట్టి వారు,
నైశ్వర్యభోగంబు లాశించువారు,
కామాత్మకులును, స్వర్గపరు లౌ వారు,
చెంద లేరు సమాధి స్థిరబుద్ధిఁ బార్థ ౪౪
వేదముల్ త్రైగుణ్య విషయముల్ పార్థ,
త్రైగుణ్యములఁ బాసి ద్వంద్వముల్ వీడు,
యోగంబు క్షేమంబు నుజ్జిన నల్పు,
మగు నిత్యసత్వస్థుఁ డాత్మవంతుఁడవు. ౪౫
నలు దెసల్ జలము పొంగారు సరస్సు
నం దెంత ఫలముండు నఖిలవేదములను
జ్ఞాని యౌ బ్రాహ్మణునకు నంతె ఫలము. ౪౬
కర్మ మందే యధికార మెప్డేని
కాదు ఫలంబులం గలది నీ, కీవు
కర్మంబు ఫలహేతుకంబు గా నీయ
వల, దకర్మంబునఁ గలదు సంగంబు. ౪౭
యోగివై సంగంబు నూడిచి విజయ,
సిద్ధ్యసిద్ధుల నొంటిఁ జేసి కర్మంబు
నాచరింపు సమత్వ మందురు యోగంబు ౪౮
కడు లొచ్చు బుద్ధియోగము కన్నఁ జేత,
ఫలముఁ జూచెడు వారు పార్థకృపణులు,

బుద్ధియోగమునందుఁ బొందుము శరణు ౪౯
బుద్ధియుక్తుఁడు త్రోయుఁ బుణ్యపాపముల
భువిఁ, గాన యత్నింపు బుద్ధియోగంబు,
కౌశలం బగును యోగము కర్మములను ౫౦
బుద్ధిఁ గూడిన మానవుల్ కర్మజ మగు
ఫలము విడిచి జన్మబంధముక్తులయి
యందుదురు గదా యనామయపదవి ౫౧

ఎపుడు మోహకలిల మీఁదు నీ బుద్ధి,
వినిన దానిదియును వినఁగల దాని
వైరాగ్య, మప్పుడు వడయఁగాఁ గలవు ౫౨
శ్రవణము వలన విప్రతిపన్నమైన
యట్టి నీబుద్ధి సమాధి నిల్కడగ
స్థిరముగా నెప్పుడు చేరియుండెడినో
యప్పుడు యోగంబు నందెదవీవు. ౫౩

అర్జునుఁడు పల్కె.

ఆర్యా! సమాధిస్థుఁ డౌ స్థితప్రజ్ఞు
తీరేమి, యే మనుస్థితబుద్ధి, యెట్లు
నతఁడు గూర్చుండునే యనువున నడచు. ౫౪

శ్రీభగవంతుఁడు పల్కె.

మనమునందుండు కామంబులనెల్ల
సవ్యసాచి, యెపుడు చేకొఁగా విడిచి,

నాతని ప్రజ్ఞగా యౌఁ బ్రతిష్ఠితము. ౬౧
ధ్యానింప విషయంబు లగువానియందు
సంగంబు నరునికి, సంగంబువలనఁ
గామంబు గల్గెడుఁ, గామంబు వలనఁ
గ్రోధంబు ప్రభవించుఁ, గ్రోధంబువలన
మోహంబు పుట్టెడు, మోహంబువలన
స్మృతివిభ్రమం బౌను, స్మృతివిభ్రమమున
బుద్ధి నాశముఁ జెందు, బుద్ధినాశంబు
వలన వినాశంబు ప్రాప్త మయ్యెడిని ౬౩
ద్వేషంబు రాగంబు విడనాడి తనకు
నణఁగిన వగు నింద్రియంబులతోడ
విషయంబు లందుఁ బ్రవేశించు నట్టి
వశ్యాత్మునకు నలవడుఁ బ్రసాదంబు. ౬౪
నీల్గు వాని వెత లన్నియుఁ బ్రసాదమునఁ,
జెచ్చెరనె ప్రసన్న చేతస్కు నకును
బుద్ధి స్థిరత్వంబుఁ బొందిన దౌను. ౬౫
లేదు భావన బుద్ధి లే దయుక్తునకు,
భావన లేనట్టి వానికి లేదు
శాంతిః సౌఖ్యంబు నశాంతున కెట్లు? ౬౬
ఏ మనంబు చరించు నింద్రియంబులకు
వశమై యది హరించు వాని దౌ ప్రజ్ఞ,
నుదకమం దనిలంబు నోడను బోలె. ౬

జొటుఁ, బ్రతిష్ఠితం బగు వాని ప్రజ్ఞ
యెవని యింద్రియములు నింద్రియార్థముల
వలన వీర, మరలింపఁబడు నంతటను　　౬౮

అఖిలభూతంబుల కగు నెద్ది రాత్రి
యందు మేల్కాంచు సంయమి, చూచు మునికి
భూతముల్ వేచు నెప్పుడు రాత్రియద్ది.　　౬౯

ఆపూర్యమాణంబు నచలంబుగాను
నుండు సంద్రముఁ జేరు నుదకంబు రీతి
నెవనిలోఁ గోర్కెలె *ల్లెలయు నాతండు
నందు శాంతిని, బడయఁడు కామకామి.　　౭౦

మమతయు నహామునుం బాసిన వాఁడు
కామంబు లన్నింటిఁ గడచి నిస్పృహత
వర్తించు నాతండు పడయును శాంతి.　　౭౧

బ్రాహ్మీస్థితి యిది యగుఁ బ్రాపించి దీని
మోహంబు పొందఁడు, ముగియు కాలంబు
నందును నీ స్థితి యందున్నఁ బార్థ
బ్రహ్మనిర్వాణంబుఁ బడయంగఁ గలఁడు.　　౭౨

---

* ఎలయుం=ప్రవేశించు.

# మూఁడవ అధ్యాయము.

## కర్మయోగము.

అర్జునుఁడు పల్కె.

కలితకన్న నెలుక ఘనమని కృష్ణ
నీమతం బయినదేని హరి నన్నేల
యా ఘోరకర్మంబునందు నిల్పెదవు. ౧
వ్యామిశ్రముగ నున్న వాక్యంబుచేత
నా బుద్ధి మోహ మందఁగఁ జేయు నటుల
నున్నావు దృఢముగా నొక్కటి చెపుమ
శ్రేయంబు దేన నేఁ జెంద నౌ దాని.

శ్రీ భగవంతుఁడు పలికె.

ఈ లోకమున నిష్ఠ యిరు తెఱంగులను
గలదని మున్ను నేఁ గఱపితి ననఘ,
యోగులకును గర్మయోగంబుచేత
జ్ఞానయోగంబుచే సాంఖ్యుల కనియు. 3
నైష్కర్మ్య మొందఁడు నరుఁడు కర్మంబు
మొదలు పెట్టమిచేతఁ, బొందంగ లేదు
మఱి సన్న్యసించిన మాత్రానసిద్ధి. ౪
క్షణమైన నెపుడేని కర్మంబు గొనక
యుండఁగ నెవఁడేని యుండఁడు గాదె,

యవశంబు గాఁగను నందఱు, ప్రకృతి
సిద్ధించు గుణములచేతఁ, గర్మంబు
నాచరింపంగఁ జేయఁబడుచురు గద ౫
కర్మేంద్రియంబులం గట్టి యెవ్వాఁడు
నింద్రియార్థములఁ స్మరించుచుండునెద
నా విమూఢాత్ము మిథ్యాచారుఁ డండ్రు. ౬
ఇంద్రియంబులఁ బార్థ, యెద నియమించి
కర్మేంద్రియములచేఁ గర్మయోగంబు
నాను నెవ్వఁ డసక్తుఁ డై వాఁడు మిగులు. ౭
కర్మ మెక్కుడుగ యకర్మముకంటె,
కావింపుము నియతకర్మ, మ చేష్ట
శారీరయాత్రయు జెరుగదు నీకు. ౮
యజ్ఞార్థ మగుచేత కన్న నొం డయిన
దానను గర్మబద్ధ మిది లోకంబు,
పొటచే సర, కర్మ మంటక సలుపు. ౯
కల్పించి ప్రజల యజ్ఞంబులతోడఁ
పలికె మును ప్రజాపతి యిట్టు లనుచు
వృద్ధిని బొందుఁడు వీనిచేఁ నివ్వి
కావుత మీ కిష్ట కామధేనువుగ. ౧౦
దేవతలకుఁ దన్వి దీన నిండల్ల
దేవతలును మీకుఁ దృప్తిగావింత్రు,
ఒకరి నొక్కరు తృప్తి నొందించువారు

నై పరం బగు శ్రేయ మందెద రీరు. ౧౧
యజ్ఞంబులను దృప్తు లయిన దేవతలు
నిత్తురు గద మీకు నిష్టభోగముల,
వారియీ యీవుల వారికి నీక
యనుభవించునో యెవం డతఁడు దొంగయగు ౧౨
యజ్ఞ శిష్టం బైన దాను సుకృతులు
పాపంబు లన్నింటి వలనఁ బాయుదురు
పాకంబు తమకుఁ గాఁ బచరించునట్టి
పాతకుల్ పాపంబె భక్షించువారు. ౧౩
భూతంబు లన్నసంభూతంబు లగును,
ప్రభవించు నన్నంబు వర్షంబువలన,
వర్షంబు యజ్ఞంబు వలనను బుట్టు,
యజ్ఞంబు కర్మమం దావిర్భవించు. ౧౪
బ్రహ్మంబువలనఁ గర్మము సంభవించు,
బ్రహ్మ మక్షరసముద్భవము నా నెఱుఁగు,
కావున నన్నింటఁ గలుగు బ్రహ్మంబు
యజ్ఞంబునం దెప్పు డౌఁ బ్రతిష్ఠితము. ౧౫
ఎవఁ డనువర్తింపఁ డిట నిట్లు జెరుగు
చక్రంబు నా పాప జన్ముండు పార్థ,
వ్యర్థ మయ్యెడు నింద్రియారాముఁడు మని. ౧౬
ఆత్మయందే యెవ్వఁ డానంద మొందు
నాత్మనే సంతుష్టి నాత్మనే తృప్తి,

గాంచు, నా నరునకు కార్యంబు లేదు. ౧౭
కృతమునఁ గాని యకృతమందుఁ గాని
యతనికే యర్థంబు నైన లేదిచేటఁ,
బొడగూడ దతనికి భూతంబులందు
నెందేనియును నాశ్రయింప నౌ న దెది. ౧౮
కర్తవ్య మగునట్టి కర్మవుం గాన
సంగంబు విడనాడి సతతంబు సలుపు;
గతసంగుఁ డగుచును గర్మముఁ జేలుపు
పురుషుండు పరమును బొందెడుఁ గాదె. ౧౯
సంసిద్ధి నొందిరి జనకాదులు కద
కర్మవుచేన; నొఁ గావింప నీకు
లోకసంగ్రహము విలోకించి యైన
శ్రేష్ఠులు నేదేది చేయుదు రదియె. ౨౦
యితరు లా జను లొనరింతురు, వారు
కెందుల ప్రమాణంబు గాను నెద్దాని
నయ్యదె లోకులు ననుసరించెదరు. ౨౧
కల్గ దేమియుఁ ద్రిలోకంబుల నాకుఁ
గర్తవ్య మగు నది గాని పొందంగఁ
బడనట్టి యదిగాని పడయఁ దగినది
యే నయ్యుఁ గర్మవందే యుందుఁ బార్థ ౨౨
ఏఁ బం॰ కొందక యొప్పుడేని కలిత
యం దుండ కుందునే ననుసరింతురుగ

మనుజు లన్నింట నా మార్గంబుఁ బార్థ. ౨౩
ఏఁ జేత సల్పనే నీ లోకములును
నడఁగు, సంకరమున కగుదును గర్త,
పడఁ గొట్టువాఁడ నీ ప్రజలనే నాడు. ౨౪
కఱతఁ దగుల్ గల్గి కావింతు రెటుల
నజ్ఞు, లసక్తుఁడై యట్లె జ్ఞాని నర
కావించు, లోకసంగ్రహ *మించి సలుప. ౨౫
కర్మసంగు లయిన జ్ఞానహీనులకు
బుద్ధిభేదంబును బుట్టింప రాదు,
సకలకర్మంబులఁ జెల్పఁ జేయఁ దగుఁ
జెల్పుచు యుక్తుఁడై జ్ఞాని యావాఁడు. ౨౬
ప్రకృతి గుణంబుల వలన నన్నింట
నాచరింపఁగఁ బడు నవ్వి కర్మములు,
తాను గర్త యటంచుఁ దలపు సేసెడును
†హంకారమున మోస మందిన వాఁడు. ౨౭
గుణకర్మభేదంబు కొలఁది తత్త్వంబు
తెలియువాఁ డర్జునా, తెంచు సంగంబు,
నడచు గుణములం గుణములు నా నెఱిఁగి. ౨౮
ప్రకృతిగుణంబుల భ్రమ మొందు వారు
గుణముల చేతలం గొనుదురు తగులు,

---

* ఇంచు = ఇచ్ఛగించు.

† హంకారము = అహంకారము.

సర్వజ్ఞుఁ డగువాఁడు చేసి దల్ల యేమి
తెలియని మందులం దికమక పెట్ట. ౨౯

అన్ని కర్మముల నాయందుఁ ద్యజించి
యాత్మయందు మనస్సు నమరించి మమత
యాసయు నుడిగిన యట్టివాఁడవయి
భండనం బొనరింపు జ్వరము లేకుండ. ౩౦

ఈ నాదు మతమును నే నూనవులును
నాచరించెడి వార లనుదినం బట్టి
శ్రద్ధధాను లసూయ చేసనట్టివారు గూడఁ
గర్మపు నుండియుఁ గడవంగఁ గలరు. ౩౧

ఈ నాదుమతమును నెవ్వరు మిగుల
*నిడుగడ నడుపుట యేమియుఁ దెలివి
లేనివారలు బుద్ధి లేనట్టి వారు
చెడిన వా రని తెలిసికొను మీవు; తన
ప్రకృతికిఁ దగినట్లు వర్తించు జ్ఞాని
కూడను, భూతముల్ కూడెడుఁ బ్రకృతి,
నిగ్రహంబున నేమి నెఱవేఱుఁ గలదు. ౩౨, ౩౩

ఎల్ల యింద్రియముల యింద్రియార్థముల
కడ నుండు ద్వేషరాగంబులు నిల్చి,
యా రెంటికిని వశం బొట కాండు,

* నిడుగడ = అసూయ.

*వానికా రెండును బగతు రౌఁ గాదె ౩౪
తనరఁ జెల్విన పరధర్మమ్ము కన్న
నౌ మేల్ స్వధర్మంబు, నయ్యు విగుణము.
నిధనంబు శ్రేయంబు నిజధర్మ మందుఁ
బరుల దౌ ధర్మంబు భయము గల్గించు ౩౫

అర్జునుఁడు పల్కె.

ఐన దేన నియుక్తుఁడై మానవుండు
బలవంతపఱుపంగఁ బడినట్టు లితఁడు
వలవకయే చేయుఁ బాపంబుఁ గృష్ణ. ౩౬

శ్రీభగవంతుఁడు పల్కె.

అది రజోగుణజంబు నైన కామ మది
క్రోధమంతయును మ్రింగునది పెఱ † గసటు
ఎఱుఁగుము దీనిని నిట వైరిగాను. ౩౭
ముఱికిచే నద్దంబు పొగచేత నిప్పు
మాయచేఁ బిండంబు మఱుఁ గొంది యుండు
నట్టుల దానిచే నావృతం బిదియు ౩౮
పార్థ జ్ఞానుల కెప్డు వైరి యౌ దీన,
నిండంగ రాని దౌ నిప్పగు నట్టి
కామరూపంబున, జ్ఞాన మావృతము. ౩౯
దీనికి మనము నింద్రియములు బుద్ధి

---

* వానికి = ఆపురుషునికి.

† కసటు = పాపము.

తా వండ్రు, వీనిచేత నిది జ్ఞానమును
బురికొని దేహుల మోహింపఁ జేయు. ౪౦
ఇంద్రియంబుల మున్ను నీవు నిల్గట్టి,
పార్థ, యట్లాటచేఁ, బాపవంతంబు
జ్ఞానవిజ్ఞానముల్ నాశంబు గొలుపు
నట్టి దా దీనిని నడుగంటఁ జేయు. ౪౧
అండ్రు పరము లింద్రియము లని, పరము
నగు నింద్రియంబుల కన్న మనంబు,
బుద్ధిపరము మనమునకన్న, నేది
బుద్ధికన్నఁ బరత్వమున నా నది యది. ౪౨
బుద్ధికన్నను బరంబు నగు దాని నిట్లు
తెలిసి యాత్మను నాత్మఁ దిరము గావించి
కామరూపంబును గష్టసాధ్య మగు
వైరిని జంపుము బాహుబలాఢ్య. ౪౩

# నాల్గవ అధ్యాయము

## జ్ఞానయోగము.

శ్రీభగవంతుఁడు పల్కె.

ఇనున కవ్యయ మైన యీ యోగ మేను
బోధించి నాఁడను, బోధించె నినుఁడు

మనువు, కిక్ష్వాకుకు మనువు బోధించె.
వరుసగ నీ రీతి వచ్చిన దీని
నెఱుఁగుదుర్ రాజర్షు, లిటనశియించెఁ
బార్థ, యా యోగంబు బహుకాలమునకు.
నాకు భక్తుండవు నాకు సఖుఁడవు
నగుటచేతనె రహస్యంబు శ్రేష్ఠంబు
నైన పురాతనం బైన యోగంబు
దీనినె నీ కిప్డు తెలిపితి నేను.

అర్జునుఁడు పల్కె.

పుట్టితి వెనుకీవు మునుపు నినుండు
పుట్టెను ముందు నీవు గఱపి తనుట
యిది యెట్టు లయ్యెడు నెఱుఁగఁగా వలయు.

శ్రీ భగవంతుఁడు పల్కె.

పెక్కులు పుట్టువుల్ విజయ, యైన యవి
నావియు నీవియు నా కవి యన్ని
యెఱుక యాఁ గౌంతేయ, యెఱుఁగవు నీవు.
అవ్యయాత్ముఁడ నయ్యు నజుఁడను నయ్యు
నే భూతముల కయ్యు నీశ, జనింతు
నే నా ప్రకృతి నధిష్ఠించి నా మాయ.
ధర్మ మెప్పు డెపుడు తక్కువ యగునో
యుడరు నధర్మంబు, నత్తఱి విజయ,

సృజియించు వాఁడను నే నన్నుఁ గాదె, ౭
సాధువులను బ్రోవఁ జెదుప దుష్కృతుల
ధర్మంబుఁ జెక్కఁగా స్థాపించు కొఱకుఁ
బ్రతియుగంబున నేను బ్రభవించువాఁడ. ౮
నరుఁడ, నా దివ్యజన్మంబు కర్మంబు
నెవఁడు తత్త్వంబుగా నెఱుఁగు నీ రీతి
దేహంబు విడనాడి తిరిగి జన్మంబు
పొందఁడు, నాతండు పొందెడు నన్ను. ౯
క్రోధరాగభయముల్ గూడని వారు
నను జేరినట్టివార్ జ్ఞానతపమునఁ
బరిశుద్ధు లయినట్టి వారు మన్మయులు
నాదు భావము పొందినారు పెక్కండ్రు. ౧౦
ఎవరు నన్ జేరెద రెట్లు నే వారి
నట్టులే ప్రోచెద, నన్నింట జనులు
నాదు మార్గంబున నడుతురు పార్థ. ౧౧
కర్మసిద్ధిని గాంక్ష గలిగిన వారు
పూజింతు రిట వేలుపులఁ, గల్గుఁగాదె
కర్మసిద్ధి నరలోకంబున వేగ. ౧౨
గుణకర్మభాగంబు కొలఁది వర్ణముల
నాల్గింటి సృజియించినాఁడను నేను,
దాని కే నయ్యుఁ గర్తను, నవ్యయుండ
ననియు నేఁ గర్తఁ గా ననియు నెఱుఁగుము. ౧౩

కర్మఫలముఁ గోరఁ, గర్మముల్ నన్ను
నంటు, వేఁ డెఱుఁగు నీ యనువున నన్నుఁ
గర్మములను వాఁడు కాఁడు బద్ధుండు. ౧౪
ముక్తిఁ గోరినయట్టి పూర్వులు గూడఁ
గర్మ విట్టు లెఱింగి కావించినారు,
కావున నీవును గావింపు మునుపు
మునుపటి వారలు ఒనరించిన పనె. ౧౫
కర్మ మే దేది యకర్మ మనియెడి
చోఁ బండితులకేని సుడివడుఁ దెలివి;
యే యె దెఱింగిన నెడయుదు కీడు
నుండి, నీ కా కర్మ ముగ్గడించెదను. ౧౬
కర్మము లౌ నెఱుఁగ, వికర్మము లగు
నెఱుఁగ, నకర్మము లెఱుఁగ నౌఁ గాదె;
కష్ట మౌ నెఱుఁగంగఁ గర్మముల గతి ౧౭
కర్మవులందు నకర్మంబు నెవఁడుఁ
కను నకర్మంబులఁ గర్మవు, వాఁడు
బుద్ధిమంతుఁడు మానవులను యుక్తుండు,
కర్మము లన్నియుఁ గావించువాఁడు. ౧౮
అఖిలయత్నంబుల నంట వెవ్వానికి
సంకల్పకామముల్, జ్ఞానాగ్ని లోనఁ
గాల్పంగఁ బడినట్టి కర్మముల్ గల్గు
వానిని జ్ఞానులు పండితుఁ డంద్రు. ౧౯

కర్మఫలంబునఁ గతసంగుఁ డగుచు
నేయాశ్రయము లేక తృప్తుఁడై యెప్పుడు
కర్మములను వాఁడు కడు మెలఁగుచును
నుండియు నించుకే నొనరింపఁ డతఁడు. ౨౦
ఆపి చిత్తాత్మల నాశల విడిచి
కైకొను బెల్లయుఁ గడచి, దైహికపు
కర్మమంతె యొనర్పఁ గలుష మొందండు. ౨౧
తనయంతఁ దొరికిన దానితోఁ బొంగి,
ద్వంద్వముల్ దాఁటి మత్సరము పోనాడి,
సిద్ధ్యసిద్ధుల యందుఁ జిత్త మొక్కటిగఁ
గర్మ మొనరిచియుఁ గాఁడు బద్ధుండు. ౨౨
ముక్తుఁడై సంగంబు పోయిన వాని
జ్ఞానమందు మనస్సు నాటినవాని
యజ్ఞంబు కొఱకయి యాచారము గల
వాని కర్మం బెల్ల ప్రలీవీయ మగును. ౨3
బ్రహ్మ యాను హవిస్సు బ్రహ్మ యర్పణము
బ్రహ్మచే హుతమగు బ్రహ్మాగ్ని యందుఁ
గర్మ మెల్లయు బ్రహ్మగాను భావించు
వానికి బ్రహ్మంబె పడయనగు నది. ౨౪
యోగులు నొక కొంద ఱొనరించు వారు
దైవ యజ్ఞంబు, కొందఱును బ్రహ్మాగ్ని
యందు యజ్ఞంబును యజ్ఞంబుచేన

హోమం బొనర్చెద, రొరులు శ్రోత్రంబు
మున్నగు నింద్రియంబుల సంయమాగ్ని
వేల్తురు, శబ్దాదివిషయముల్ మఱియుఁ
గొందఱు నింద్రియాగ్నుల వెలిచెదరు ౨౫, ౨౬
ఇంద్రియకర్మంబు లెల్లఁ బ్రాణంపు
కర్మంబులను గూడ జ్ఞానదీపితము
నగునట్టి యాత్మసంయమ యోగవహ్ని
హోమంబు సేయుదు రొక్క కొందఱును ౨౭
ద్రవ్యయజ్ఞంబు స్వాధ్యాయ యజ్ఞంబు
జ్ఞానయజ్ఞము తాపస మగుయజ్ఞంబు
నొనరింతు రొరులట్లె యోగయజ్ఞంబు
చేలుపుదురు యతులు సంశితవ్రతులు ౨౮
పరులు ప్రాణాయామ పరులును నైన
యట్టి వా రాపి ప్రాణాపాన గతులఁ
బ్రాణంబునందు నపానంబు మఱియుఁ
బ్రాణంబు వేల్తు రపానంబు నందు ౨౯
అశననియతి గలయట్టివా రొరులు
ప్రాణముల్ వేల్తురు ప్రాణంబులందు.
వీ రెల్లరును యజ్ఞవిదులు యజ్ఞమునఁ
బాపంబులను నెడఁ బాసినవారు. 30
యజ్ఞశిష్టం బైన యమృతంబుఁ గ్రోలు
వారు సనాతన బ్రహ్మమొందెదరు.

యజ్ఞంబు చేయని యతని కిహంబు
నమరదు, తక్కిన యదియేడ విజయ 3౧
బహువిధ యజ్ఞములు బ్రహ్మముఖంబు
గా నిట్లు ప్రబలెను గనుమవి యెల్ల
కర్మంబువలనను గలిగెనా నిట్లు
కాంచి మోక్షంబును గలవు పొందంగ 3౨
ఘనమగు ద్రవ్యయజ్ఞంబున కన్న
జ్ఞానయజ్ఞము మీర, జ్ఞానమందు నర,
యఖిల మా కర్మంబు నంత మా నెల్ల 33
ప్రణిపాతమునఁ బరి ప్రశ్నచే సేవ
నెఱుఁగుము దాని, వచింపఁగాఁ గలరు
దేని నెఱింగినఁ దిరిగి మోహంబు
ని ట్లొందవో, దేన నెల్ల భూతముల
నాత్మఁ గందు, వట నాయందు, నీ కట్టి
జ్ఞానంబుఁ దత్త్వంబు కను జ్ఞానులు నర. 3౪
పాపులలో నెల్ల ప్రబల మా పాపి
యగు దేనియు నెఱుక యను తెప్ప చేత
నీఁదంగఁ గలిగెద వెల్ల పాపమ్ము. 3౫
మండెడి నిప్పట్లు మండల బూది
గావించు నట్టుల జ్ఞానాగ్ని యన్ని
కర్మంబులను బూది గావించు విజయ. 3౬

జ్ఞానంబుతో సరిగాఁ బవిత్రంబు
కల్లదుగా యిటః కాలంబు నందు,
యోగసంసిద్ధిని నొందిన వాఁడు
తనయందుఁ గాంచెడు దానిని దానె. ౩౮

సంయతేంద్రియుఁడును శ్రద్ధ గలాఁడు
పడయు జ్ఞానంబుఁ దత్పరుఁడు నౌ వాఁడు,
జ్ఞానమొంది యచిరకాలంబు లోనఁ
బరమ మౌ శాంతిని బడయంగఁ గలఁడు. ౩౯

శ్రద్ధ లే నట్టియు జ్ఞానంబు లేని
సంశయాత్ముఁడు చెడు, సంశయాత్మునకు
లే విహాపరములు లేదు సుఖంబు. ౪౦

యోగంబుచేఁ జేత లుడిగిన వాని
జ్ఞానంబునఁ గతసంశయుఁ డైన వాని
నాత్మవంతుండును నై నట్టివానిఁ
గర్మముల్ బంధింపఁ గానవు పార్థ. ౪౧

కావునఁ బార్థ యజ్ఞాన జాతంబు
నై యెద నుండు నీ దైన యీ శంక
జ్ఞానాసిఁ ద్రెంచి యోగము బూను లెమ్ము. ౪౨



# ఐదవ అధ్యాయము.

## కర్మసన్న్యాసయోగము.

అర్జునుఁడు పల్కె.

కర్మసన్న్యాసంబుఁ గంసారి, మరల
యోగంబుఁ బొగడెద వొకటి గుర్తించి
చెప్పుము నా, కెద్ది శ్రేయ మీ రెంట. ౧

శ్రీభగవంతుఁడు పల్కె.

కర్మసన్న్యాసంబు కర్మయోగంబు
రెండునుగూడ నిశ్శ్రేయస మిచ్చుఁ,
గర్మసన్న్యాసంబు కన్నను ఘనము
నగుఁ గర్మయోగంబు నా రెంటఁ గూడ. ౨
కోపింపఁ డెవ్వాఁడు కోరఁ డెవ్వాఁడు
నాతఁడు నిత్యసన్న్యాసి నా నెఱుఁగు,
ద్వంద్వముల్ లేనట్టి వాఁడు సుఖముగ
బంధంబులనుండి పాయుఁగా వీర. ౩
ఒకటి సాంఖ్యము మఱి యొకటి యోగమని
బాలు రందురు గాని పండితు లనరు,
చక్కఁగా నొక్కటైన సాధించు వాఁడు
ఫలము రెండింటిది పడయఁగాఁ గలఁడు. ౪

సాంఖ్యంబుచేఁ గల్గు * చెక్కు యోగంబు
వలనఁ గూడను నలవడఁగను గలదు
యోగంబు సాంఖ్యంబు నొక్కటిగాను
జూచు నట్టియతండె చూచెడివాఁడు. ౫
సన్న్యాసమొందఁ గష్టంబు యోగంబు
పొందక, యోగి యౌ మునియు బ్రహ్మంబు
శీఘ్రంబె యర్జునా, చెందఁగాఁ గలఁడు. ౬
విజితేంద్రియుండును విజితాత్ముఁడు మఱి
పరిశుద్ధ మౌ నాత్మవాఁడును యోగి
యఖిల భూతాత్మ యౌ నాత్మగలాఁడు,
చేయుచుండియుఁ గూడఁ జెందఁడు సోఁకు. ౭
కూర్కుచుఁ గనుచు మూర్కొనుచు నంటుచును
వినుచును దినుచు నూపిరిని గొనుచును
గొనుచు విడుచుచుఁ బల్కుచును జనుచును
గనులను దెఱచుచు గాని మూయుచును
నింద్రియార్థంబుల నింద్రియంబులును
మలసెడు నను నది మదిలోన నిలిపి,
యొనరించు నద్ది లే దొక్కటే నేను
నని, యుక్తుఁ డై యొంచె నగుఁ దత్త్వవిదుఁడు. ౮, ౯
బ్రహ్మంబునందుఁ గర్మంబుల నిల్పి
సంగంబు విడనాడి సలిపెడు నెవఁడు,

*చెక్కు = స్థానము.

తామరాకును నీరు తాకని పగిది,
పాపంబువలనను వాఁ డంటఁ బడఁడు. ౧౦
బుద్ధి మనఃకాయములఁ గేవలంబు
నింద్రియంబులచేత నేనియుఁ గాని
యోగులు కర్మంబు నొనరింతు, రాత్మ
శుద్ధికొఱకు నను సంగము విడిచి. ౧౧
కర్మఫలంబును గడచి యుక్తుండు
నా వాఁడు నైష్ఠికం బౌ శాంతిఁ గనును.
కామంబు ప్రేరేప్రఁగా ఫలాసక్తి
కలిగి యయుక్తుండు కట్టువడెడిని. ౧౨
మనసుచే సర్వకర్మంబుల విడిచి
చేయింపకుండను జేయకయుండను
దొమ్మిది వాకిళ్ల పొలుందు పురిని
పాయితానెను వశి యవు దేహి యుండు. ౧౩
కర్తృత్వమును గాని కర్మమును గాని
కలిగింపఁడు పతి లోకమునకుఁ గఱత
వంటు కూడిక గాని, ప్రకృతియే పఱపు. ౧౪
ఎవని పాపముఁ గాని యెవని పుణ్యంబుఁ
గాని కాఁడు విభుండు గైకొను వాఁడు;
అజ్ఞానమున జ్ఞాన మావృతం బైన
యది, దాన జంతువు లందు మోహంబు. ౧౫
అపుడు నాత్మజ్ఞానమందు నెవ్వరిది

యైన యా యజ్ఞాన, మా పరంబైన
వారి జ్ఞానము సూర్యు పగిది వెల్గించు. ౧౬
ఆ యాత్మ నా నిష్ఠ నా పరాయణత
నా బుద్ధినియును గలారు జ్ఞానమునఁ
బాపంబు చెదరిన వార లై తిరిగి
రా నట్టి పదమును బ్రాపించు వారు. ౧౭
విద్యావినయునందు విప్రునం దైనఁ
గుంజరం బందైన గోవునం దైనఁ
శ్వానమం దైన శ్వపాకునం దైన
సమదర్శనంబుతో జ్ఞాను లుండెదరు. ౧౮
మనసు నెవ్వారిది సామ్యంబున నుండు
నిటనె సర్గము వార్ జయించిన వారు,
బ్రహ్మ మౌఁగద దోషరహితంబు సమము,
బ్రహ్మమం దుందురు వారు కాఁబట్టి. ౧౯
పల్లటిల్లని బుద్ధి వాఁడు, మౌఢ్యంబు
నందనివాఁడు, బ్రహ్మంబున నుండు
నటువంటివాఁడు; బ్రహ్మవిదుఁడు, చనదు
ప్రియమైనఁ బొంగ నప్రియమైనఁ గుంద ౨౦
వెలిసోఁకులన్నది పెనఁగనీకుండ
నాత్మలోఁ గలసుఖ మానెడు నట్టి
యల బ్రహ్మయోగ యుక్తాత్ముండు, చేటు
కల్గని సుఖమును గాంచెడి వాఁడు. ౨౧

సోఁకులం గల్గెడు సుఖము లెవ్వియొ
దుఃఖహేతువులె యగుఁ, దుదమొదల్ గలవి,
వానిలోనను సుఖింపఁడు జ్ఞాని పార్థ. ౨౨
క్రోధకామముల నా క్షోభమిచ్చుటనె
ఓర్వఁ గలం డెవ్వఁ డొడ లూడక మును,
నాతండు యుక్తుండు నా నరుండు సుఖి ౨౩
తనయందె విహరింపుఁ దనయందు నెవఁడు
నందెడు సౌఖ్యంబు న ట్లెఁడు వెలుఁగు
వహియించుఁ దనయందె, బ్రహ్మభూతుఁ డయి
బ్రహ్మనిర్వాణంబుఁ బడయు నా యోగి. ౨౪
అఖిల భూతహితార్థు లకలుషాత్ములును
నద్వైధులు యతాత్ము లౌ నట్టి ఋషులు
బ్రహ్మనిర్వాణంబుఁ బ్రాపించువారు ౨౫
కామక్రోధంబులం గడచినయట్టి
* యతచిత్తులు యతాత్ము లైన యతులకు
బ్రహ్మనిర్వాణంబు వఱలు నెల్లెడల. ౨౬
వెలుపలి సోఁకుల వెలిపుచ్చి, కనుల
బొమ్మల నడుమనె చూనిచ్చి, నాస
నడుమ నాడెడు నపానంబుఁ బ్రాణంబు
రెండింటినిం బొనర్చి సమంబులుగను,
బుద్ధిని నింద్రియంబులను మనస్సు

* యతచేతసాం = యతచిత్తాత్మనాం.

స్వాధీనములఁ జేసి, భయము కోపంబు
కామముల్ వీడి, మోక్షముఁ బొందఁ గోరు
ముని యెవ్వఁ డాతండు ముక్తుఁడే యెపుడు. ౨౭,౨౮
యజ్ఞంబుఁ దపమును నానెడు నట్టి
సర్వలోకమహేశు సర్వభూతముల
సుహృదు నన్ను నెఱింగి చేచ్చును శాంతి. ౨౯

---

# ఆఱవ అధ్యాయము.

## ఆత్మసంయమయోగము.

శ్రీభగవంతుఁడు వల్కె—

కర్మఫలంబును గమనింపకుండఁ
గర్తవ్యకర్మంబుఁ గావించు నెవఁడు
నాతండె సన్న్యాసి యాతఁడే యోగి,
యగ్నిక్రియాహీనుఁ డౌ వాఁడు కాఁడు ౧
అర్జునా, సన్న్యాస మందురు దేని
నయ్యది యోగంబు నని యెఱుంగునది,
సన్న్యసింపఁ బడని సంకల్పములను
గల యెవ్వఁ డేనియుఁ గాఁడుగా యోగి ౨
యోగంబుఁ బొందఁగా నుత్కంఠ గలుగు
మునికి సాధనము కర్మ మని యనెదరు.

అంద్రు యోగారూఢుం డైన యంతటను
శమ మౌను వానికే సాధనం బనుచే ౩
ఎపుడు కర్మములను నింద్రియార్థముల
ననుషంగమును వీడు నప్పుడు కాదె,
యఖిల సంకల్ప సన్న్యాసి యౌ వాని,
ననియెడు వాడు యోగారూఢుం డంచు. ౪
ఆత్మ చేతను దనను దేల్చుకొనం,
దన నణంచికొనంగం దగ, దాత్మయేగద
తన చుట్టు మాత్రయే తన విరోధియును. ౫
తన నెవ్వం డాత్మ చేతనె గెల్చు నట్టి
వానికి యగునాత్మ బంధు వాతనికిం,
దనయందు గెల్పు నందనివాని యెడనౌ
వైరంబు కావించు వైరి యట్లాత్మె. ౬
హెచ్చులొచ్చుల నట్టి యొగ్గులగ్గులను
జలివేడుముల నాత్మ సాధించునట్టి
బహుశాంతునకు నొందంబడుం బరమాత్మ. ౭
జ్ఞానంబు చేత విజ్ఞానంబు చేత
* నాదట చెందిన యాత్మం గలాండు,
నిశ్చలుండు విజితేంద్రియుండును నైన
పొన్నుటా మనోజ్ఞపోలికం జూచు,
యోగిని నందును యుక్తుండు నాంగ. ౮

* ఆదట=తృప్తి.

అరిసుహృన్మిత్ర మధ్యస్థబంధువుల
యందు నుదాసీనులందు సాధువుల
యందు ద్వేష్యులఁ బాపులందు సమమగు
బుద్ధిని గలవాఁ డవును విశిష్టుండు. ౯
కోరకయును గయికొనకయు యోగి
చిత్తాత్మలను లోను జేసి యేకాకి
యై రహస్యం బైన యట్టిచో నుండి
సతతము నాత్మ నిశ్చలముసేయ నగు ౧౦
కడు నెత్తు కడ లోఁతు కాని మడుఁ *గెడఁ
గుశలపై నజినంబుఁ గోక నాపైనఁ
గల యాసనంబును గట్టిఁగాఁ దనకు
స్థాపించి దానిమీఁదను గూరుచుండి,
యమరించి మనసు నేకాగ్రంబుఁగాను
జితేంద్రియంబులఁ జేష్టలఁ గట్టి,
యాత్మశుద్ధికి యోగ మాచరింపనగు ౧౧, ౧౨.
మేనును దలయును మెడయుఁ జెక్కంగఁ
గదలకుండ స్థిరముగాఁగ ధరించి,
దిక్కులం జూడక దృష్టిని దనదు
కొన ముక్కునను బాదు కొల్పి, మనంబు
నాఁపి, ప్రశాంతాత్ముఁ డగుచు, భయంబు
నడఁగించి, బ్రహ్మచర్యవ్రత మూని,

* ఎడ=చోటు

చిత్తంబు నాపైనఁ జేరిచి, నన్నె
భావించుచును, యోగివలయుఁ గూర్చుండ. ౧౩, ౧౪
నియతమానసుఁడై యనిశమును యోగి
యాత్మ నిట్లూఁపి, నాయందలి దైన
నిర్వాణ పరమశాంతిఁ బడయుఁ వాఁడు. ౧౫
ఎక్కువ తినువాని కేమియుఁ దినని
వానికిన్, గడుఁగూర్కు వానికిన్ గూర్కు
లేనివానికిఁ బొసఁగ లేదు యోగంబు. ౧౬
పాటిగా విహరించుచుఁ, బాటిగాఁ గుడుచు,
మెలఁగువ పనుల్ మితముగాఁ గలుగు,
మితముగాఁ బనులందు మెలఁగు, నాతనికి
దొరకొను, దుఃఖములఁ దొలఁగు యోగంబు ౧౭
నియతమగు చిత్తంబు నిల్చునో యాత్మ
యందె యెప్పుడు, కోర్కె లన్నింటను స్పృహ
నుడిపి, యుక్తనఁబడు యుక్తుండు నాఁగ. ౧౮
గాలి కొట్టని చోటఁ గలుగు దీపంబు
చలియింపకుండునో పోల్చునదియు
నాత్మయోగంబు నభ్యాసంబు చేయు
యతచిత్తుఁడగు యోగి కగు నుపమంబు. ౧౯
ఎట యోగసేవ వారింపఁ బడునది
యుపరతిఁ గను, నెట నుండియు నాత్మ
నాత్మచేఁ గని యాత్మయందె తుష్టిఁగొను,

నింద్రియంబుల మీఱి యెఱుఁగ బుద్ధికగు
నాయనంతసుఖంబు నాతఁ డెం దెఱుఁగు,
నెందుండి తత్త్వమం దేమి తొలఁగఁడొ,
* తనికిన దేనిని దానికన్న మఱి
యితర మే లాభంబు నెక్కుడు గాను
భావింపఁ, డెందుండి ప్రబలదుఃఖముల
వలననేఁ గదలండొ, పాటింపుదాని
వంతల కలయిక పాపు యోగమని;
అట్టి యోగంబును, నాస్థమై వ్యధను
జెందని మనసుతోఁ, జెల్లునుగూర్ప. ౨౦,౨౩
సంకల్పభవములౌ సర్వకామముల
నడుగంట విడనాడి, యన్నింటఁ జెక్క
నిల్పి యింద్రియము లన్నిమనస్సుచేన,
ధృతి గొన్నబుద్ధిచేఁ దిరముగా మనసు
నాత్మయం దమరించి, యల్లన నొను
నుపరతిఁగనఁ! జేన దొండేమి తలఁప. ౨౪,౨౫
స్థైర్యంబు లేక చంచలమగు మనసు
నెందెందుఁ జేనుదాని నీడ్చి యందుండి,
యాత్మయందే వశం బగును జేయంగ. ౨౬
శాంతమనస్వియు శాంతిని గొన్న
రాజసగుణుఁడును బ్రహ్మభూతుండు

* తనుకు=కలుగు.

నపగతకిల్బిషుం డైన యీ యోగి
శ్రేష్ఠ మైనసుఖంబు చేయును గాదె. ౨౭

ఇవ్విధంబుగ నాత్మ నెప్పుడు నిల్పి,
సుఖముగా గతకల్మషుం డైన యోగి
కొనలేని బ్రహ్మసోఁకు సుకము నొందు. ౨౮

ఎల్లెడ సమముగా నీక్షించు నట్టి
యోగ యుక్తాత్ముండు యోజించు నాత్మ
నన్ని భూతమ్ముల నందు దానిగను,
నాత్మలో భూతంబు లన్ని యున్నవిగ. ౨౯

ఎవ్వండు నన్నింట నీక్షించు నన్ను
నన్నింటఁ గాంచు నాయందును మఱియు,
వానికి నే లేని వాఁడను గాను
వాఁడు నాకును లేనివాఁడుగా కుండు. ౩౦

అఖిలభూతంబుల యందుండు నన్ను
నేకత్వ మొంది భజించు నెవ్వండు
వాఁ డెన్ని విధముల వర్తించుచుండు
నేని నా యందె వర్తించు నా యోగి. ౩౦

సుఖమైన దుఃఖంబు సొప్పడెనేని
తనఁబోలె నన్నింట దరిసించు నట్లు
గా, నెవ్వఁ డా యోగి ఘనుఁ డండ్రుపార్థ. ౩౨

అర్జునుఁడు పల్కె.

"సామ్యంబు నను జేసి సమకురు నట్టు,
నో కృష్ణ పల్కితే యోగంబు నీవు,
చంచలతను దీని స్థైర్యంబుఁ గాంచే. ౩౩
చంచలము, బలము చేలము గలదియుఁ,
గలఁచునది, మనసు గదకృష్ణ, దాని
గట్టుట గాలిని గట్టుట వోలె
దుష్కరంబు గదునాఁ దోఁచెడు నాకు" ౩౪

శ్రీభగవంతుఁడు పల్కె.

"నిక్కంబు మనసు దుర్నిగ్రహంబు మఱి
చంచలం, బయ్యు విజయ నిల్పనగును,
వైరాగ్యమునను నభ్యాసంబున జయ. ౩౫
అవునా మత మనమ్యాత్మునకొందఁ
గా నసాధ్యంబు యోగంబని, మనసు
స్వాధీనమయినట్టి యత్నంబు గల్గు
వానికిఁ బడయ నుపాయంబున నగు." ౩౬

అర్జునుఁడు పల్కె.

"కలిగియు శ్రద్ధను గడక లేనట్టి
యోగంబు నందుండి యుర్లిన మనసు
నున్నట్టి యాతండు యోగసంసిద్ధి
పొందక యే గతిఁ బోయెడుఁ గృష్ణ. ౩౭

యోగ మెఱుఁగు కోర్కె యున్నమాత్రమున
నతఁడు శబ్దబ్రహ్మ *మతకరించెడిని. ౪౪
జేతనంబు కడఁకతోఁ జేలుపువాఁ డగుచు
హృతకిల్బిషుఁ డయి యనేకజన్మములఁ
బ్రాప్తసంసిద్ధుఁ డౌ వాఁ డయి యంతఁ
బరమ మౌ పదమును బ్రాపించు యోగి ౪౫
†నేటు తాపసులకంటెను యోగి మఱియు
జ్ఞానుల కన్నను ఘనుఁ డని యెంతు,
కర్ముల కన్నను ఘనుఁ డగు యోగి;
కావున యోగివి కమ్ము కౌంతేయ ౪౬
శ్రద్ధమై, నా యందు స్థాపించి మనసు
భజియించు నెవఁడు నర వాని దలంతు
యోగు లందఱన్నైత ముత్తముఁ డంచు" ౪

# ఏడవ అధ్యాయము.

## విజ్ఞానయోగము.

శ్రీభగవంతుఁడు పల్కె.

నాయందు మనసూని నన్ను బ్రాపుగొని
చలుపుచు యోగమే చేడ్పున నన్ను

---

* అతకరించు = అతిక్రమించు. † నేటు = శ్రేష్టము.

సంపూర్ణముగను నిస్సందేహముగను
దెలియఁగాఁ గలవో కౌంతేయ దాని విను. ౧
ఎద్దాని నెఱిఁగిన నిటమఱి యెఱుఁగ
నగున దొండొకటి లేదగు నట్టి దిదె
జ్ఞానంబును సవిజ్ఞానంబు గాఁగఁ
గడమ లేకుండ నేఁ గఱపెద నీకు. ౨
నరుల వేలకొలంది నడుమ నెవ్వండొ
యొకరుండు సిద్ధికై యత్నించు, నట్టి
యత్నించు సిద్ధులం దొకఁ డెవ్వండొ
యెట్టిది యున్నదట్టులఁ గను నన్ను ౩
అనిలంబు భూమియు ననలంబు జలము
నాకసంబు మన సహంకృతి బుద్ధి
యనఁగ నాదు ప్రకృతి యయియునది యిద్ది
భిన్నమై యెనిమిది విధములుగాను. ౪
ఇయ్యది యపరంబు నింతకన్న మఱి
యితరంబు దీనిచే నిజ్జగంబు, నర,
మోవఁగాఁ బడు, జీవభూతమౌ నట్టి
నా ప్రకృతిఁ బరము నా నెఱుంగునది. ౫
సర్వభూతంబులు జన్మించు నిందు
నని యెఱుంగుము మఱి యఖిలమౌ జగముఁ
బుట్టించువాఁడనేఁ బొలియించువాఁడ ౬
నాకన్నఁ బరమున్న దదియొండు లేదు

దారాన మణుల వితతియట్లుఁ బార్థ
యంత యున్న దిది నాయందుఁ గూర్పఁబడి ౭
చంద్రార్కులను గాంతి, చేవినీట, నరుల
యందుఁ బౌరుష మేను, నఖిల వేదముల
నోంకారమును, శబ్ద ముప్పరవీది,
భువి సుగంధంబు, నిప్పున వెల్గు నౌదు,
నఖిలభూతంబుల నౌదు జీవనము,
నర, యాదును దపోజనంబులఁ దపము. ౮, ౯
అఖిలభూతంబుల కాదిబీజంబు
నగుదును నని నన్ను నర్జునా యెఱుఁగు
బుద్ధిమంతులయొక్క బుద్ధి నే నౌదుఁ
దేజస్వు లగువారి తేజంబు నేను ౧౦
పార్థ యాదును బలవంతుల యొక్క
కామంబు రాగంబు గలియని బలము,
భూతంబులను ధర్మమున కెడగాని
యట్టి కామంబును నగుదును నేను. ౧౧
సాత్వికము లెవి రాజసపు భావములు
నేవి తామసములు నెయ్యవి యగునో
నావలనివె యవి నాఁగ నెఱుంగు,
ఉండు నాలో నవి యుండనే నందు ౧౨
మూడు గొనంబుల పొందైన వైన
యీ భావములచేత నీ జగం బెల్ల

గొలుచు, నరిది కలుగుట యట్టిఘనుఁడు. ౧౯
తమ తమ ప్రకృతిచేత నియమింపఁబడి
అల కోర్కులను జ్ఞాన మడఁగిన వారు
నయి యయ్యయి నియతు లాని యితరులు
నగునట్టి వేల్పుల నాశ్రయించెదరు. ౨౦
ఎవ్వఁ డెవ్వండు నే యే రూపమునను
భక్తుఁడై శ్రద్ధమై భజియింపఁ గోరు
నతని యా శ్రద్ధనే యచలంబు సేతు. ౨౧
అలశ్రద్ధతో వాఁడు నంటిన వాఁడు
నై కోరు వారినే యర్చింపఁ గాను,
నాచేతనే వినిర్ణయము లైన యల
కోరికల్ వారిచేఁ గొనియెడుఁ గాదె. ౨౨
దేవులం గొల్చువార్ దేవులం గంద్రు,
స్వల్పంబు నగునట్టి జ్ఞానంబు గలుగు
వారి యాఫలము నశ్వరము నైన దగు,
నన్ను గొల్చెడి వారు నన్నె పొందెదరు. ౨౩
మేలైన తెలుఁగని మేటిలేనట్టి
నా తీ రెఱుఁగని యజ్ఞానులు నన్ను
నవ్యక్తు, వ్యక్తిఁ గొన్నట్టు లెంచెదరు. ౨౪
ఎల్లవారల కేను నెఱుఁగఁగా రాను,
అగుటచే యోగమా యాసమావృతుఁడ,
నన్ను వివేకశూన్య మగు నీ జగము

# ఎనిమిదవ అధ్యాయము.

## అక్షరపరబ్రహ్మయోగము.

అర్జునుఁడు పల్కె.

ఆ బ్రహ్మమేది యధ్యాత్మ మెట్టియది
ఎది కర్మ మధిభూత మెయ్యది యందుర
అధిదైవ మెయ్యది యందురు కృష్ణ, ౧
ఎవఁ డెట్టు లధియజ్ఞుఁ డీ దేహమందు,
నం దెట్లు హరి నియతాత్ములచేత
నేగు కాలమునను నెఱుఁగ నయ్యెదవు ౨

శ్రీ భగవంతుఁడు పల్కె.

ఔ బ్రహ్మము పరమ మౌ నక్షరంబు,
అధ్యాత్మ మనఁబడు నది స్వభావంబు,
భూతభావంబులఁ బొడమించు నద్ది
యగు విసర్గముకర్మ మనఁగను బరఁగు ౩
అధిభూత మన నర యంతవంత మగు
నట్టిది, పురుషుండు నధి దైవతుండు
నధియజ్ఞుఁ డీ దేహమందు నేనె యగు ౪
చచ్చునప్పుడు నన్నె స్మరియించు చెవఁడు
నేగు దేహంబు త్యజించి వాఁ డొందు
నా భావము ననుమానంబు లేదిందు ౫

ఏదేది భావంబు నెంచుచుఁ, దుదను
సంగంబు విడు, నెప్పుడట్ల భావంబె
కలుగంగ, దానినే కాంచును పార్థ ౬
సతతంబు కావున స్మరియింపు నన్ను
పోరును జేలుపుము బుద్ధియు మనము
నాయందుఁ బాదుకొన్న యతండవు నయి
నిక్కంబుగా నన్నె నీవు పొందెదవు ౭
అభ్యాసయోగంబు నానిన దొండుఁ
జేరని చిత్తంబుచేఁ దలంచుచును
బరమపురుషు దివ్యుఁ బ్రాపించుఁ బార్థ ౮
భక్తియుక్తుఁ డయి యెవ్వండు, కడచేను
కాలంబునందు యోగబలంబుచేన
తొలఁగనట్టి మనస్సుతోఁ జెక్క నసువు
భ్రూమధ్యమున నిల్పి పూర్వుఁడు కవియు
నఖిల నిర్మాతయు నణువులలోన
నణువును నిర్ణేత యగు తలంపంగ
రానిరూపము వాని రవివన్నె వాని
ధ్వాంతంబు దాఁటిన పరమ పూరుషుని,
భావించు నాతండు పడయు నా దివ్య. ౯, ౧౦
అందురు వేదజ్ఞు లే దక్షరం బనుచు,
నేదాని రాగరహితు లైన యతులు

*కూర్కొందు, రెద్దాని గోరిన వారు
బ్రహ్మచర్యంబున వర్తింతు, రట్టి
పదము సంగ్రహముగా వచియింతు నీకు. ౧౧
ద్వారంబు లన్నింటిఁ బంధించి లెస్స
మ దెద నిడి తలకుం దనదు ప్రాణంబు
రప్పించి యోగధారణమును బొంది ౧౨
ఓ మ్మను బ్రహ్మమౌ నొక్క యక్షరము
నుడువుచును స్మరియించుచు నన్ను, నొడలు
† నెడయుచు నెవఁడు పోయెడు, నట్టి వాఁడు
పరమ మైన గతిని బ్రాపింపఁ గలఁడు. ౧౩
ఇతరంబుపై మనం బేగని వాఁడు
నై నిత్యయుక్తుండు నై యనుదినము
నెవఁడు నన్ స్మరియించు నెప్పుడు పార్థ
అట్టి యోగికి నేను నౌదు సులభుఁడ. ౧౪
పరమ మౌ సంసిద్ధిఁ బడసిన యట్టి
వారౌ మహాత్ములు ప్రాపించి నన్ను,
నస్థిరమైన దుఃఖాలయ మైన
యట్టి జన్మంబును నందరు తిరిగి. ౧౫
కౌంతేయ బ్రహ్మలోకంబుతోఁ గూడ
నిఖిలలోకంబులు ద్దిరిగి వచ్చునవె,
నర, లేదు నను బొందినన్ బునర్భవము. ౧౬

---

* కూర్కొందురు=ప్రవేశింతురు. † ఏడయు=ఉజ్జగించు.

పగలు రే లెఱిఁగిన వారు, బ్రహ్మ దగు
పవలెద్ది యయ్యది పదినూఱ్ యుగములు
గలదని, రాత్రి యుగములు వేయింటిఁ
గలయట్టి దనియును గనుగొనియెదరు. ౧౭
పగలు రాఁ గలుగు నవ్యక్తంబువలన
వ్యక్తముల్ సర్వముల్, వచ్చుడు రాత్రి
యడఁగు నా యవ్యక్త మను దానియందె. ౧౮
విజయ, యా యీ భూతవితతె యవశము
గాఁ బుట్టి పుట్టియుఁ గడచేను చుండు
రాత్రి రాఁ, బగలు రాఁ బ్రభవంబు నొందు. ౧౯
అల్ల యవ్యక్తంబు కన్న నన్యంబు
నైన యవ్యక్తంబు నాది లేనిదియు
నగు భావ మే దది, యఖిలభూతములు
నశియించుచుండఁగ నశియించి పోదు ౨౦
అక్షరం బవ్యక్త మనఁగను బరఁగుఁ,
బరమ మౌ గతి యని వచియింత్రు దాని,
దేనిని బొందినఁ దిరిగి రా, రట్టి
పరమ మౌ నట్టి యా పదమగు నాది. ౨౧
ఎవనిలో భూతంబు లిరవొంది యుండు,
నెవనిచే వ్యాప్తమౌ నియ్యది యంత,
ఆ పరమపురుషుఁ డన్యముండనిది
యా భక్తిచేఁ బార్థ, యాను లభ్యుండు. ౨౨

ఏకాలమున యోగు లేగినఁ దిరిగి
వచ్చెద రెపుడు పోవ మరల రా రొ,
యట్టి కాలంబు నో యర్జునా, వినుతు. ౨౩

అగ్నియు జ్యోతి యహస్సు శుద్ధంబు
నారు మాసము లుత్తరాయణం బందుఁ
బ్రాణంబు విడిచెడి బ్రహ్మజ్ఞులైన
వారలు బ్రహ్మంబుఁ బ్రాపింపఁ గలరు. ౨౪

తుది యర్ధమాసంబుఁ ధూమంబు రాత్రి
యందును దక్షిణాయన మారునెలల
యోగి యిందు జ్యోతి నొంది వచ్చెడిని. ౨౫

సిత మసితము లివి స్థిరమైన రెండు
గతులు జగమునకుఁ గదయంచు నెంతు,
నొకట ననావృత్తి నొందు నన్యంబు
వలన నేతెంచుట వాటిల్లుఁ దిరిగి ౨౬

ఈ రెండుమార్గంబు లెఱిఁగిన యోగి
యెవ్వఁ డేనియు మోహ మెనయండుపార్థ,
కావునను సకల కాలంబులందుఁ
గుంతీజ యోగయుక్తుండవు కమ్ము. ౨౭

ఏ పుణ్యఫలము వచింపఁగాఁ బడియె
యజ్ఞంబులఁ దపములందు వేదముల
నీవు లందును గూడ, నియ్యదెఱింగి,

దానినినంతయు దాఁటును యోగి
యాద్యంబు పరమంబు నగుస్థాన మొందు. ౨౮

---

# తొమ్మిదవ అధ్యాయము.

## రాజవిద్యా రాజగుహ్యయోగము.

శ్రీ భగవంతుఁడు పల్కె.

అశుభంబువలన నెయ్యది దెలుంగ, విడువఁ
బడుదు వట్టిదియును బహురహస్య మిదె
జ్ఞానంబు విజ్ఞానసహిత మౌ దాని
నుగ్గడింతు నసూయ నొందని నీకు ౧
రాజవిద్యయు నిద్ది రాజగుహ్యంబు
ధర్మ్య ముత్తమము ప్రత్యక్షావగమము
శుద్ధ మవ్యయము సుసుఖ మాచరింప ౨
ఈ ధర్మమున శ్రద్ధ యొనయని నరులు
మరణయుక్త మగు సంసారమార్గమున
మగుడి వత్తురు నను బ్రాపింపక నర 3
అఖిల మౌ నీజగం బవ్యక్తమూర్తి
యయిన నాచేఁ దతంబగునుగా, యందు
నిఖిలభూతము లుండు నేవాని యందుఁ
గా నున్నవానిని, గావు భూతములు

నాయందు నున్నవి; నాదు మేటిదగు
కూరుపునుం గనుఁగొను, భూతములను
బొడమించు నా యాత్మ భూతము లందు
నిరవొందదు మఱి భరించు భూతముల ౪, ౫
అంతటఁ జరియించు నది విపులంబు
నగు వాయు వాకాశమం దెప్పు డుండు
నట్లు నాయం దుండు నన్ని భూతములు
నా నెఱుంగుము పార్థ, నాదు ప్రకృతిని
భూతంబు లన్నియుఁ బొందుఁ బ్రళయము
కాలమందును, సృష్టి కాలంబునందుఁ
గ్రమ్మఱ వానిని గలిగింతు నేను ౬, ౭
అస్వతంత్ర మగు నీ యఖిలభూతముల
ప్రతతిఁ బోరింబోరిఁ బ్రకృతివశముగఁ
బుట్టించెదను నేను బూని నా ప్రకృతి. ౮
ఆసక్తి కల్గక యాకర్మములను
దగులము లేని యాతని యట్టు లుండు
నన్ను నా కర్మముల్ నర, కట్టఁ గావు ౯
అర్జునా యధ్యక్షుఁడైన నాచేతఁ
బ్రకృతి చరము నచరంబును గాంచె.
వర్తించు జగము బల్ వగల నీ కతన ౧౦
భూతమహేశ్వరంబు నయిన నాదు
పరమభావంబు నేర్వని మూఢ జనులు
వపువు దాల్చిన నన్ను వజ్ఞ సల్పెదరు. ౧౧

రిత్త కోర్కులవారు రిత్తచెయ్దముల
వారు రిత్తతెలివి వారు పాలసులు
రాక్షసంబును నాసురంబు మోహంబు
నందించు ప్రకృతినే యాశ్రయించెదరు. ౧౨
దివ్యమా ప్రకృతిఁ బొందినయట్టి వారు
నా ఘనులో నను భూతాదిముఁ గొల్త్రు,
ఎద నన్నె మెన్నక, యెఱిఁగి యవ్యయుఁగ ౧౩
యతమానులు నను నిత్యంబును గీర్తి
పచేరించు వార్ స్థిరవ్రతులును భక్తి
నెపుడు యుక్తులును నయినవారు నన్నుఁ
బ్రణమిల్లువారు నై భజియించు వారు. ౧౪
విశ్వరూపుఁ డగు న న్వేఱొండు వారు
జ్ఞానయజ్ఞమున బూజనము సేయుచును
వేఱు వేఱనియును బెక్కండ్రు ననియు
నొక్కండె యనియును నొవరింత్రు నేవ. ౧౫
ఏ యజ్ఞ మేఁ గ్రతు వే స్వధ నేనె
యాజ్య మేనే యగ్ని నౌషధం బేనె
యేనె హుతంబును నేనె మంత్రంబు ౧౬
ఏను దండ్రియుఁ దల్లి నీ జగంబునకుఁ
దాతయు ధాతవేద్యంబుఁ బావనము
మఱియును ఋక్కునుం బ్రణవమ్ముఁ గూడ
సామంబును యజుస్సు సాక్షియు గతియు

భర్త నివాసంబుఁ బ్రభువు సుహృత్తు
శరణంబుఁ బ్రభవంబు స్థానంబు లయము
సమిసి పోనట్టి బీజము నిధానంబు. ౧౭, ౧౮.
నే నెండఁ జేయుదు, నేను వర్షంబుఁ
గురిపింతు నిలుపుదుఁ గూడ నేఁ బార్థ
సత్తు నసత్తును జావు నమృతము. ౧౯
యజ్ఞంబులను నన్ను నర్చించి యాని
సోమపానంబులను జ్యూతపాపులు తిగ
ప్రాఁజదువుల వారు స్వర్గలోకమును
బొందఁ గోరెదరు, వార్ పుణ్య మా నట్టి
స్వర్లోకమును బొంది స్వర్గంబు నందుఁ
దినెదరు దివ్య మౌ దేవభోగముల. ౨౦
వారా విశాల మౌ స్వర్గలోకంబు
ననుభవించియుఁ బుణ్య మంత మందంగఁ
బొందెదర్ నరలోకముఁ, దొలిపలుకుల
*పాటి నానెడు వారు వలపుల వలపుఁ
గలవారు రాకపోకలఁ గందురిట్లు. ౨౧
ఎవరు వే ఱొండుఁ జింతింపక నన్ను
నారఁ గొల్తురల నిత్యాభియుక్తులవి
యోగంబు క్షేమంబు నూనుదు నేను. ౨౨
ఇతర దేవతలందు నెవ్వారు భక్తిఁ

* పాటి=ప్రమాణము.

గూడియు శ్రద్ధతోఁ గొలిచెద రట్టి
వారును నవిధిపూర్వకముగ నన్నె
కొలుచు వారౌదురు కుంతీతనూజ. ౨౩
అఖిలయజ్ఞంబుల కగుదుఁగా నేనె
ప్రభుఁడ భోక్తయును, దత్వంబుగా నన్ను
వా రెఱుఁగరు, గానఁ బడియెదరు గాదె. ౨౪
వేల్పులం గొల్చువార్ వేల్పులం గంద్రు,
పితరులం గొల్చువార్ పితరులం గంద్రు,
భూతముల్ గొల్చువార్ భూతముల్ గంద్రు,
నను గొల్చువారును నన్నె కాంచెదరు. ౨౫
పత్రంబొ పుష్పంబొ ఫలమొ తోయంబొ
యెవ్వండు భక్తితో నిచ్చును నాకు
నట్టి శుద్ధాత్ముండు నర్మిలితోడ
నర్పించు దాని నే ననుభవించెదను. ౨౬
ఎయ్యది యొనరింతు, వెద్ది కుడుతువొ,
హోమ మెయ్యది సేతువో, యొసంగెదవొ
యెయ్యది, సల్పెదవే తపం, బద్ది
యర్జునా సల్పు నా కర్పణంబుగను. ౨౭
కష్టసుఖంబులఁ గలిగించు నట్టి
కర్మబంధంబులఁ గడచెద విట్లు,
సన్న్యాసయోగ మెసంగిన యాత్మ
ముక్తుండ వై నన్నుఁ బొందెద వీవు ౨౮

